శ్రీ ర స్తు.

శ్రీసుబ్బరాయపద్యంబులను

# మానవధర్మప్రదీపిక.

## మొదటి సంపుటము.

---

లోకహితార్థంబుగ బ్రాహ్మణక్రాక నివాసుండును

సాధుజనామోదుండును సాంఖ్యతారకా

మనస్కోపాసకుండునునగు

పోకూరు సుబ్బరాయునిచే

రచియింపంబడి

పండితులచే సరిజూపించి

సర్వజనాహ్లాదకరంబగునటుల

తియ్యబిండి మల్లయ్యగారున్ను మరికొందరి యొక్క

ద్రవ్యసహాయంబున

కావలి

ఎడ్వర్డు ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1912.

దీని వెల 4 అణాలు.

శ్రీ

# విజ్ఞప్తి.

శ్రీమద్వేదాంతసారులును - మహాయోగపురుషులును - భావాతీతులును - విశ్వబ్రహ్మవంశోద్భవులును - సువర్ణసగోత్రస్థులును - హానుమునిగిరి నివాసకులునగు చెరుకూరి శివరామబ్రహ్మేంద్ర యచలగురుస్వాములు మదీయ జన్మసాఫల్యతనుగుణించి శ్రీరాజయోగముపదేశించి కొన్నిదినంబుల కనుభవజ్ఞానమును పరిశీలించి కవిత్వసిద్ధిగలుగనభయంబొసంగె నంతకొందఱుమిత్రులభిలషింపనేను గురుతారావళియును - మైరావణనాటకంబును - శ్రీమామహేశ్వరశతకంబును - త్రిపురాసురవధయును - సుగుతిపద్యములను-యచలమార్గంబును - సుందరాకాండంబును - వచనరీతిలఘు వైద్యశాస్త్రంబును - రచియించినాడ - ధనము లేమిచే కొందరి ద్రవ్యసహాయమువలన 1905 సంవత్సరంబున రచియించిన సుబ్బరాయపద్యములను మానవధర్మప్రదీపికయం దున పూర్వభాగమునున్ను 1910 న సంవత్సరములో రచియించిన రెండవ సంపుటమగు వుత్తరభాగమును మాత్రము ముద్రింపించడమైనది.

ఇట్లార్యజన విధేయుడు,

పోకూరు సుబ్బరాయుడు,

బ్రాహ్మణకాశిక.

గీ॥ సత్వభావులుగురుమూర్తి సములుక్రొత్త- పల్లెబ్రహ్మయ్య ధరపొండి పాటికామ - యార్యులాదిగ పెద్దలనభినుతించి - గ్రంధమొనరింతు పరమేశుకరుణగలుగ.

శ్రీ

# విషయసూచిక.

---

ఈగ్రంథమందున మనుష్యవర్తనమున్ను - గృహజలశల్యవాస్తువులున్ను - ముహూర్తప్రకరణమున్ను - కాలమానస్థితిగురించిన సుభిక్షదుర్భిక్షవర్ణనయున్ను - గ్రహోదయాస్తమానాభివర్ణనమున్ను - గ్రహణఫలమున్ను - ప్రశ్నావిషయమున్ను - శకునవిషయములున్ను - యంత్రవిషయములున్ను - బాలగ్రహచికిత్సావిషయములున్ను - స్వప్నఫలవిషయములున్ను - ఛాయాపురుషాది విషయములున్ను - సాముద్రికవిషయమున్ను - వైద్యవిషయమున్ను సంగ్రహముగా చేర్చబడియున్నవి.—దీని వెల అణాలు ౦—౪—౦.

ఈగ్రంథముయొక్క రెండవసంపుటమును ఉత్తరభాగంబున స్త్రీపురుష వర్తనలున్ను - ప్రయాణాది ముహూర్తవిషయములున్ను - గోచార, శకున ఫలములున్ను - సాముద్రికాది ధర్మములున్ను - గృహస్థధర్మములున్ను - వైద్య విషయమున్ను - మోక్షానుకూలమగు సమస్తధర్మములున్ను - సుమతిశతకమును - అచలమార్గమున్ను - అష్టాంగయోగ నిరూపణమున్ను - సంగ్రహముగా చేర్చబడియున్నవి.

దీని వెల అణాలు ౦—౪—౦.

ఇట్లు సుజనవిధేయుడు,

పోకూరు సుబ్బరాయుడు.





శిష్యులు.    గురువు శివరామమూర్తి.    శిష్యులు.

శ్రీరస్తు.

శ్రీవుమామహేశ్వరాయనమః

శ్రీసుబ్బరాయపద్యములను

# మానవధర్మప్రదీపిక

పూర్వభాగము.

శ్లో॥ గురుబ్రంహా గురోర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పరబ్రహ్మః । తస్మైయిశ్రీ గురవేనమః ॥

శ్రీగిరిజామనోధవుడు శ్రీలలరాఘచు నిండుకోర్కెచే ।
నాగరికంబుకై సలిల నామకకన్యశశాంకవహ్నుల ।
న్వేగధరించియందునను వేట్కజనించక నాశ్రయింపగా ।
నీగసుభూషణాకృతి వహించుఘనోగ్రునుతింతు నెమ్మదిన్ ॥

ఉ॥ శ్రీలలనాజనార్దనుల జెల్వగుశైలజ భూతనాథుల - న్బా లగభారతీవిధుల సామజవక్త్రగురుప్రకాండము - న్మేలగు భక్తి చేగొలచి మేదినిమాయిలవేల్పులైనశ్రీ - వ్యాళకులేంద్రుపేర కృతిప్రాశి సమర్పణజేతుబ్రోవగ్ ॥ కం॥ కృతిలో పద్యములకు తుద - నతికెదనే సుబ్బరాయుడనునది మొదలీ - క్షితిగలసర్వాఖ్యలున - న్నతినెనరున నాదిశేషుడా! రశిబ్రోవఁ ॥ సీ॥ వసుధవిశ్వబ్రహ్మ వంశసాగరసోముడఖిల తేజోవంతుడపులమాన - నుండు సజ్జనసమ్మతుండు పోకూరు వీరాచార్యుడను ఘనుండలరుచుండు - నచ్చమాంబాయన సతనికళత్రంబు యమ్మిథునంబునకవతరించి - న ట్టి పుత్రత్రయంబతియోగ్యులనవచ్చు నందునమత్పితృ డమలయశుడు - సుబ్బరాయాంహ్మయుడని సొంపుమీరు - మాతృకభిధాన మనినకామాక్షమాంబ - వారిలకుముద్దు తనయుండ పరగనన్ను సుబ్బరాయుండటందురు సుబ్బరాయ ॥ గీ॥ మానువంశగోత్ర మరయభదాశ్వాస - మనెడినామమయ్యె వినుమునీను - పూర్ణ కరుణవలన బొడమువంశంభును - నన్ను నేలవలయు పన్నగేంద్ర ॥ గీ॥ పూర్వకవుల నెల్ల పూర్ణభక్తిసలంతు - నిప్పుడున్న వారిగొప్ప జేతు - కుకవిగణము మీదగురి నిల్వదెప్పుడు - సుఖమొసంగిబ్రోవు సుబ్బరాయ ॥ గీ॥ చందశబ్ద ప్రబంధముల్ చదువలేదు - ఎరుగ కావ్యంబులెట్టివో ధరణిలోన - గ్రంధవాచకమూలేదు ఘనులుదరచ - దైవకృపవల్లజేతు గ్రంధముఫణీంద్ర ॥ కం॥ బాలులపలుకులువతుగా - నాలించుచుకోపభావమందకప్రేమ - న్బాలించ బుధవరస్తుతి - చాలాజేయుచునుభువిని సాహస్రఫణా ॥ గీ॥ గ్రంధమున పూర్వభాగంబునందుజ్యోతి - షమునుయుత్తర భాగంబు జదివిజూడ - జనులసంసారధర్మముల్ ఘనులమతము - నెరుక బడప్రాతు ధరణిలో గరళదంష్ట్రా ॥ సీ॥ శ్రీవసుంధరను

ప్రశిద్ధిగా భరియింప నేదేవునకుజెల్లు నీకుగాక - బలిసద్మమునను దోర్బలశక్తినివశింప నేదేవునకుజెల్లు నీకుగాక - పద్మనాభునకు తల్పంబౌచు ప్రబలంగ నేదేవునకుజెల్లు నీకుగాక - చంద్రశేఖరుని భూషణరీతివెలుగంగ నేదేవునకుజెల్లు నీకుగాక - నీవు భూమికాది దేవుండవు మదీయ - గృహనివాసవేల్పు విహమునందు - నన్ను కరుణజూచి ననవరతంబున సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ గీ॥ ఇష్టదైవ వినుతినిటుల గావింపుచు - నేను వ్రాయబూనుకున్న గ్రంథ - మునకు నాద్యమెట్టులనిన జెప్పదలంతు - సుఖమొసంగు మయ్య సుబ్బరాయ ॥ సీ॥ శ్రీవసుంధరను సుశ్రేయుండు భద్రాశ్వసంబనియెడి గోత్రసంభవుండు - ప్రవిమలుండును విశ్వబ్రహ్మ వంశుండును శివరామ నామంబుచేత ప్రబలు - సత్పాత్రుడాతని సతిజొన్నమాంబయా నమ్మిథునంబున కవతరించె - మల్లయాచార్యుండు మహదయిశ్వర్యుండు మహితమానసుడు సన్మార్గధనుడు కందర్ప సుందరాకారుండు సజ్జనామోదుండు ననుగాంచి మోదమలర - కృతినియొక్కటిజెప్పి కీర్తినొందుమటంచు బలుకరింపమనంబు పరమహర్ష - మొంది గురుడుదెల్పు ముఖ్యాంశములుకొన్ని - వ్రాశి సుబ్బరాయస్వామివారి కర్పణంబొనర్తు నబలుండనీ కృతి - నాదరింపవలయు నార్యులార ॥ సీ॥ వసుధలోననుఘనవంతమైనదియును యిష్టార్థసమితి నందించునదియు - సుమనసాహ్లాదంబు శుభకరచరితంబు కల్మషహారణంబు గలుగునదియు - పరమపావనమైన ధరణీధరంబొప్పునను మునిగిరి పేరజనులుపొగడ- నమ్మహానగమునందఖిల శుభప్రదచరుణుండు విజ్ఞానసాధనుండు- పరమేశ్వరసముండు భక్తబాంధవుడును శివరామనామంబుచేప్రశిద్ధి-జెందునట్టిఘనుని జేరుట్కై శిష్య-వర్గమరుగుచున్న వారివెంట-జని నమస్కరించసంపూర్ణకరుణతో-నిటులబలికెనయ్యకుటిలహరణ॥

## గురోపదేశము.

కం॥ బాలా నీవిటులనురా - జాలినకారణమదే దోసత్యంబుగ నా - చాలువినుపింపుమనినా - వేళన్నిటుకోరినాడ విషధరచంద్రా ॥ గీ॥ పరమగురువర్య భవదంఘ్రి పంకజములు - బట్టి శేవించు నరునకు పట్టుగాను - మోక్షగతినివ్వ గలరని మోదమునను - వచ్చితినుంగనిటుల వాక్రుచ్చెనభవ ॥ సీ॥ వినరోరి వరభక్త జనులకావశ్యక - మగుధర్మములు దెల్ప మదిజెలంగె - నట్టియర్థంబున నఘుదూషితంబును ఇష్టార్థసంశిద్ధి నిదియుగాక - దైవగ్నుకను పేరు తనువేరుయనుతీరు ఖర్మను వెలిజేయ గలుగుఘోరు - దెప్పించగలదియు దివ్యమైనదియును దైవమహ్లాదించ దగినదియును - కడుయశస్కరమైనట్టి గ్రంధమొకటి - నీకు నెరిగింతు దానినీ నేర్చుకొలది - ననుభవమునకు దెచ్చుకొమ్మనుచునిటుల - బలుకదొడగెను వినుమయ్య ఫణికులేంద్ర ॥ సీ॥ పూర్వయుగంబులన్ భూతాధినాధుతో గట్టులగాట్ పట్టి ఇట్టులనియె - లోకహితార్థ మనేకయంశంబులు దెలిపితిరిన ఘూర్తకలియుగమున - మనుజవర్తనమునకును ధర్మములుకొన్ని దెలుపంగవలెనని బలుకునంత - భవుడు ప్రసాదింపబడిన యాంశంబులు మద్గురుండగు శేషమహాని దెల్పు - తెరగు దెలియుమిటుల దివ్యమంగళవిగ్ర - హుండుపూర్ణుడవ్య యుండనాది - లోనప్రబలుచుండు లోకంబులకుముండు వినుమటంచు బల్కె విషధరేంద్ర ॥ గీ॥ దైవవిభులకు దైవమైదగెడువాడు - వాక్కునకునస్వాంతమునకందు వడనివాడు - యాదిమధ్యాంతములు లేక నలరువాడు - బడశె నొకయిచ్ఛయనుదాని పవనభక్ష ॥ సీ॥ ఇచ్ఛయనే శక్తి హెచ్చుగా జనియించి బహుతరాకృతితోడ బరిఢవిల్లి - యమ్మహామహుని తానాశ్రయించిన దామతిరిగి స్వతంత్రంబు దెచ్చుకొనుచు -

చుట్టుముట్టడి వేళ చోద్యంబులనుజూపి మృత్యుమందునుజల్లి మరగ
జేసి - రూపనామక్రియ లేర్పాటుగావించి లోకముగ జూపించి
శ్లోకపరచి - కపటవృత్తినిబూని కనుపొగ రెక్కించి స్త్రీగాను
యగుపడి చెలిమిజేసి - తనపూర్వపరిమితి దలపోయనివ్వక సు
చ్ఛులలో దోగిసి నొడలిపట్టి - పొడుచుపసరంబునకుముక్కు బొడ
చితాళ్ళు - గట్టి త్రిప్పినగతి నిట్లయట్లు బెసక - నల్ల లేకుండగారా
టపాటులవశా - జననమరణాకుల్యతో ద్రిప్పు నెఫణీంద్ర ॥ గీ॥
అగెజగన్మోహినియను యనాదిమాయ - ముప్పురయ్యలగన్నట్టి
ముదిత ఇంద్ర - జాలరూపిణి త్రిగుణసంజాతమాత - ఆదికిని ఆదియ
గునని నాదిశేష ॥ గీ॥ దేవునకు దేవి వేరని దెగడదగదు - దేవి
యధికారమే దేవదేవునిదియు - దేవదేవునియిచ్ఛయే దేవియనియు
జప్పనగునంచు వినబల్కె బెప్పగాడ ॥ కం॥ ఆపర్వేశ్వరి ధ్యానము-
జేసిన నరునకునభీష్టసిద్ధిని గలుగున్ - జేసితనతల్లినూడుగ - బోరి
చునని ప్రేమకరుణాభుజగాధ్యక్ష ॥ సీ॥ తనకుపినొదంబు జనకము
రెన్యకెత్తు ఓంకారమాత్రుడై యొప్పుచున్న - ప్రణ్వంకారమనుశబ్ద
మిశ్రణంబగువంత పంచభూతంబులేర్పడెను ఘనత - పంచభూత
ములతో బ్రహ్మాండమయ్యెను బ్రహ్మాండమును పచపట్టిజూడ - ఘన
జంతుజాలంబుగా గానబడుచుండు ... మానుజజన్మముధరిత్రి -
నాల్గుకోశములతో నలరారుచున్నది - యపుడుతనునుగనిని యు
ట్టినరుడు - కోటిజన్మలెత్తి క్రొల్లబోయినగాని - ఆదిజిక్కదనియె
నాదిశేష ॥ సీ॥ పంచభూతములతో బరగెడుదేహముల్ - స్త్రీ
లు పురుషులటంచు చెలగుచుండి - ద్వైపీకృతంబని దలపోయనేక
గర్వంబునొందుచు ఖర్తలందు - పోరిడిమగల్గి వ్యాపారములాస
గించి బంధకంబునజిక్కుబడి బెనంగిధర్మంబు పరమచేదాచును వ
ర్తించి క్షితిపునర్భవము నార్జితముచేసి - ఎల్ల వేళల నిటులనే ప

గి శౌగి - దివ్య పదభ్రష్టులగుచును తెలివి లేక - నాదియంత్యంబు తెరుగక నలమటబడు - చుండగలరంచు వినబల్కె సుబ్బరాయ॥

సీ॥ ధరలోన జనులకు దైవమే తలిదండ్రి యంతకన్నను వినాయవడుగాడు - బంధువర్గంబన్న భగవంతుడేగాక యంతకన్నను వినాయవడుగాడు - బ్రాతృలైననుగాని పరమేశుడేగాక యంతకన్నను వినాయవడుగాడు - సర్వసౌఖ్యంబులా సర్వజ్ఞుడివ్వక యంతకన్నను వినాయవడుగాడు - తల్లితో డునిడ దారాసుతాదులు - తనకు కలిమిబలిమి దైవకృతము - గాక వేరుగాను లోకమాను ననిది - సత్యమనుచు జెప్పె సన్నుతాంగ॥ సీ॥ కర్మజీవుల నేత్రకమలంబునందుండు ఇంద్రియర సమతిసుందరులగు - స్త్రీల మొగంబు నిరీక్షించి నంతలో చలరేగుచును దిక్కు దెలియనీక - చిందులాడుచునుండు నంసుకుసామీప్య స్నేహితుండును సుఖాశినుడగుచు - ప్రబలుచుండెటి జీవుడబలుడై యావింత నంగీకరించుచు నాలమరిగి - స్త్రీల గర్భంబునను జొచ్చి జెప్పతరము - గాని దురవస్థనొందుచు లేనిపోని - జననమరణాదులకుజిక్కి జగతియందు - సుఖము గనునింపడని జెప్పె సుబ్బరాయ॥ సీ॥ ఇలలోనజనులు జితేంద్రియులనిపించ జ్ఞానకర్మేంద్రియ గణమునడ్డు - జేయుచుండురదేటి చేష్టలుజ్ఞానాన కింద్రియాకలటంక మేమి లేదు - ఇంద్రియ జయమన్న నీప్రకారముగాదు అదివేరుగానుండు ననఘులందు - యుండిట్టియు లేనట్టి యుపమెరుంగగవలె చేసిచేయని నేర్పు చేకొనవలె - ధర్మమంగుమనము దగిలించియుట్టిట్టు - గదలనీక నిలుపు ఘనునకేద - యడ్డులేదటంచు నర్థిలివినబల్కె - నన్ను కరుణనేలు పన్నగేంద్ర॥ సీ॥ ఏప్రొద్దు దైవంబు నేదలంచుచునున్న వానిసమాన మెవ్వాడుగాడు - నోరూరగా దైవ చారుకీర్తనమును పాడేటివాడు సత్ప్రాజ్ఞుడవని - బహిరాంతరములను

ప్రబలుచున్నాడని దలపోయఁగలవాఁడు ధన్యుఁడగును - తనమనో
ధనమును దైవార్పణను జేయ బడువానికిని యమబాధలేదు -
దైవమందున సద్భక్తి నెనరువాఁడు - లోకపూజ్యుండు వాఁడె సుశ్లో
కుఁడనఁగ - పేరు నొందునటంచును ప్రేమమీర - దెలుపదొడఁగెను
ఫణివంశ జలధిసోమ ॥ ఉ॥ దైవముజ్ఞానమై నిలచి ధర్మము ధ
ర్మము లెన్నుచుండియూ - భూవల యంబునన్ జనన మొందెడ
ప్రాణుల కుర్తకోద్ది ప - ద్భావము నొందువారలకు స్వర్గమొ
సంగుచు దుస్స్వభావులన్ - వ్యావిరిదుఃఖవార్ధి బడవైచునెన్
ఫణివంశభూషణా ॥ సీ॥ తలిదండ్రులన్నలు దమ్ములెవ్వరు రారు
ధర్మమొక్కటివెంట దగిలివచ్చు - ఆలుబిడ్డలు బంధుజాల మే
మీరారు ధర్మమొక్కటివెంట దగిలివచ్చు - భూరిపశ్వాదులు
భూము లేమీరారావు ధర్మమే తనవెంట దగిలినడచు - కులగోత్రము
లుకోద్ది గొప్ప లేమిరావు ధర్మమొక్కటె వెంటదగిలివచ్చు - ధ
ర్మమును దానికిని సాటిధరణి లేదు - వడినిప్రత్యక్ష దైవమై వెన్నె
కెక్కు - గనుక ప్రతివాడు ధర్మమే ఘనతమీర - గూర్చనగునం
చు వినబల్కె కుండలేంద్ర ॥ కం॥ ధనపుత్ర ధనంబులచే - త
నుతరియించెద నటంచు ధైర్యము నొందున్ - జనుడుర్విలో నావి
ధమును - వినుపించెద వినుమట నేను విషధరచంద్రా ॥ గీ॥ ధ
నము పుత్రధనము దగియున్నవానికి - యిహామునందు భోగమి
చ్చునట్టి - ధనము పుత్రధనము ధర్మాంశమొందితే ; ఫలముగల
దటంచు బలెకెనభవ ॥ సీ॥ ధరణిమానవులకు దగ్గియుండు నొక
పెట్టి యదియట్టులనిన నీమదినియుంచు - అన్నముగలవాని కన్నం
బొసంగుట వస్త్రతృప్తునకును వస్త్రమిడుట - సుఖమొందువానికే
సుఖముజూపించుట ద్రవ్యదాతలకును దానమిడుట - దాక్షిణ్యమం
దున ద్రవ్యంబుదూకుట ధర్మమన్నను లోభి తనముగొనుట - కుల

కాంతకనులకు కోతిగానుండుట పరకాంత బంగారు ప్రతిమయగు ట - ఇటుల కొందరిమతములీ యిహామునందు - నెప్పుచుండును నలుగాక నుచితమైన - మార్గమరయంగ మేలని మహితవృత్తి - ననియె ఫణివంశదీపాయ నాధరత్న ॥ సీ॥ ధనమునుంచేగదా త నవారు మనవారటన్నది లేకున్న నదియులేదు - ధనమునుంచేగదా తగుబంధుజాలంబు లదిలేకపోయిన నదియులేదు - ధనమునుంచే గదా తయునాతుపరివారం మదిలేకపోయిన నిదియులేదు - ధనము నుంచేగదా దాసదాశీజన మదిలేకపోయిన నిదియులేదు - ధన ముగలవాడె హెచ్చుజాత్తైనవాడు - ధనముగలవాడె బహుళ ఖ్యాత్తైనవాడు - ధనముగలవాడె మిగుల నీత్తైనవాడు - అంత యును ద్రవ్యమందున్నదనె నహీంద్ర ॥ సీ॥ ధనమున్నవానికి ధర్మ మార్గమునున్న ధనముగల్గనేమి ఘనముపుడమి - ధనమెప్పుడున్న దో దైవభక్తియుతగ్గు ధనముగల్గనేమి ఘనముపుడమి - ధన మున్న నిరుపేదలను బ్రోచ్చితేగదా ధనముగల్గనేమి ఘనముపు డమి - ధనమున్నయెడలను దారిద్ర్యదశజూపు ధనముగల్గనేమి ఘనముపుడమి - నిటులప్రాప్తించు చుండుసీయుల నరులకు న టులలేకున్న ధనికుడైనట్టివాని - తోటి సాటివ్వరిజన కోటిలోన- నమ్ము మిదిసత్యమనిబల్కె నాదిశేష ॥ గీ॥ మోక్షము నెడిధనము మొదటివస్తువుదాని - గూర్చునట్టిఘనుడు కుతలమందు - దైనస ముడటంచు కలపోయనగునె - సుఖమొసంగుమయ్య సుబ్బరా య ॥ కం॥ గురువును నార్జించగవలె - గురుధర్మంబ నౌడి ధన ము గూర్చగవలయుకా - ధరదండ ధనునిదాడిని - నిరశించక ద గునటనెను నిర్మలచరితా ॥ సీ॥ గురుధర్మమెరుగని కుమతుండు భువిలోన పుట్టినఫలమేమి పుట్టకేమి - తారకంబను మహాదాం శంబునొందని జనుడున్ననేమి లేకున్ననేమి - సాంఖ్యసూత్రంబును

సాధింపనేరని వానిపందయటంచు బలుకకేమి । ధీరతనమునస్కందె
ర వెరుంగనివాడు దైవదూరుడు వానినలచనేమి । దైవమున గా
పతారింబుదాల్చునవుడు । తననువర్ణించు కొనుకేట్ల జనిత
మొంది । గానినుష్కర్మ బెంచుచు కలుషరాశి ।, నింపుటకుగా
దు గాద నెకుండ తెంద్ర ॥ సీ॥ అటువంటిసువివేక మునిలో జను
లకు సంప్రాప్తపడదేని సత్వమతిని । యశమును ద్రవ్యంబు నెవడై
తెగూర్చునో వానికీసరిబోలు వానిగాన । దైవజ్ఞుడనువాడు ధరి
యించునదిగాక సభవర్ణనీయుడై జలగుచుండు । నిస్వార్థముల నె
ల్ల స్పష్టంబుగా నొందు గతకల్మషుండౌచు గణనకెక్కు । కడనుస్వ
ర్గవాశిగా గానబడుచుండు । నట్టియశము నొంద నట్టిజనుడు ॥ పు
ట్టనేమిభువిని పుట్టకున్ననునేమి । ఫలమటంచుబలికె పన్నగేంద్ర॥
కం॥ దేవా దైవజ్ఞత్వం । బేవిధమున దొరుకు మోక్షమె ట్లప్రాప్తిం
చు । న్నా వివరంబును దెలుపను । నా వేళన్నియలబలికె నగిధాత
ల్పా ॥ గీ॥ దానమునసైన సప్తసంతానవిషయ । ముంమునసైన
ను సర్వధర్మము లెరింగి । నంమునసైనను గురుశేవయంసైన । కీ
ర్తిలభియించునని వాసుకేంద్రఘునా ॥ గీ॥ ఇదియు మొదలుగా
ను యిలలోపులననేక । విషయములను యశము వెలయునందు ।
జ్యోతిషమున నశుభశుభసూచనలు గాంచ । వలయుననుచు దెలిపె
వ్యాళచంద్ర ॥ గీ॥ ఆదిలోను జగతి కాధారభూతుండు । పంచ
పురుషుడనెడు ప్రభుడువంచ । బ్రహ్మలనగపేరు బడశిలోకంబులు
సృష్టిజేసెనని మొ శ్రీశశేంద్ర ॥ సీ॥ పంచబ్రహ్మలటంచు నెంచ
నొప్పెడువారు ధరలోనమనుమయత్వష్టశిల్పి ॥ విశ్వజ్ఞులావీర విక్ర
ముల్తిధ్యాదులను జేశి రదియెట్లులన్న వినుము । మనువు ప్రతిధిని జేశె
మయుడు వారము జేశె త్వష్టయుడు కరణంబు బుట్ట జేశె । శిల్పియును
ప్రభుండు జేశె యోగంబుల కరణముల్ విశ్వజ్ఞ కలుగ జేశె । నిట్టి

పంచకమును సృష్టిజేయుటజేసి - ఇందువలనలోకమందుజరుగు-
సర్వకార్యములకు సాధనంబగుచుండు - ననుచుబలికెనయ్య ఫణి
కులేంద్ర ॥ సీ॥ గృహము ప్రతిష్ఠింప కూపమారంభింప గమ
నాన కభ్యంగనముకు వస్త్ర - ధాన్యాక్షౌర విత్తనములు జల్లింప
స్త్రీరజస్వలకు నిషేకమునకు - శిశుపుమ్స్వమునకు సీమంతమునకు
ను జాతకమన్న ప్రాశనమునకును - పురమి చౌలమునకు పుస్త్రైం
ప్రుకలకును అక్షరాభ్యాసో పనయనమునకు - వైవాహికమునకు
వరగ్రహాచారంబునకు శఖునాది సంధానమునకు - ఇట్టికార్యము
లకు సీమైనువర్గముల్ - గలఫలాఫలముల దెలుపుచుండు - గా
నఇట్లు దెలియఘనులందు రనిదెల్ప - సుఖమొసంగుమయ్య సు
బ్బరాయ ॥ కం॥ గురువర గృహవాస్తును స - త్కరుణను నెరి
గింపుమన్న కనికరమొదవన్ - ధరయందున నిటులబలికెను - వ
రవాతగ్రసనవంశ వననిధిచంద్రా ॥ గ్రుహవాస్తువు.

## గ్రామముఅచ్చుదల.

సీ॥ గ్రామాచ్చుదలనిందు గాన్పింతునరుని రూపముగ్రాసి త
లనర్థపదియునేసి - వదనములోమూడు హృదయమందున నైదు
పదములందారునుగుదము నొకటి - నాభికమలమందు నాల్గుగుం
హ్యంబున రెండును కుడిచేత నొందు నెడమ - చేతనొండె వ్రాసి
ప్రీతితో పైనుంచి వరుసగా కూడినవచ్చుసంఖ్య - నక్షత్రసం
ఖ్య యూసనిగనుమెట్లన్న గ్రామతారాది తానామతార - వరకు
నెంచగబల్కు బడినయుంగ ఫలము దెలియుంగ వలయు నదెట్టులనిన
తలనున్నలాభంబు ధనహానిముఖమున హృదిధనధాన్యంబు లొంద
వుపాద - ములను దారిద్రంబు ప్రుతియుగుదంబున నాభినికలిమి
శిశ్నమునపీడ - లాభమొదవజేయు లక్షింపకుడిచేత - నెడమచేత

మృతిని బడయజేయు - గనుక నిట్టుల దెలసి జనసంఘములు జేర్ర - వలయు ననుచు బలికె వాసుకేంద్ర ॥

## అ ష్ట వ ర్గు.

కం॥ పదునారుగదుల నేర్పడ - విధియించినయష్టవర్గు వివరము దెలుపుఁ - పదనప్రతిష్ఠయందున - విదితంబిదియనుచుబల్కె విషధరచంద్రా ॥ గీ॥ ఇంద్రదిక్కు మొదలు ఎనిమిదిమూలల - యందునకచటతపయశలనియెను - ఎనిమిదక్షరముల నేర్పాటుగా వించ - వలయుననుచుబల్కె వాసుకీంద్రా ॥ కం॥ తనవర్గమేది యగునో ॥ గనియందునమందిరములుగట్టినపురుషమిఁక / ఘనధన జనశుభదములను - గననగుననిజెప్పెనయ్య కద్రువతనయా ॥ కం॥ గరుడుడుమార్జాలముకే - సరిశ్వానముసర్పమెలుక సామజశశము ల్ - ధరవర్గములకువిభులని - కరమరుదుగబల్కబడెను కరుణాభరణా ॥ గీ॥ హెచ్చువర్గవాడు వచ్చిహీనపువర్గ - మీదకట్టవచ్చు మోదముననను - తగ్గువర్గవాడు ధరహెచ్చువర్గున - కట్టకూడదనెను కలుషభంగ ॥ గీ॥ అరయతనపువర్గ కైదవవర్గము - పవమవైరమనుచు బలుకుచుండు- గానవర్గులెరిగి కట్టుకోమనిజెప్పె సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ కం॥ తననామరాశికిని మూటను ఏడిట పదియునొక్కటను యొంబైదిం - టను తొమ్మిదింట గృహాముం - చిన శుభకరమనుచుదెల్పె జింహ్మగనాధా ॥ గీ॥ నామవర్గసంఖ్య నాలయస్థలవర్గ - సంఖ్యకుడిని ఎడమునరవినిల్పి - అష్టమమునభాగ హారంబుజేయ శే - షముధనంబటంచు జనుఫణీంద్రా ॥ శేషార్థం॥ అకారము మొదలుకొని ॥ కం॥ అను లోమవి లోమముగా - గణుతించిన లెఖ్కరుణముగా నెన్నబడుఁ - ధనర్ణుణములు సమమైనన్న - జనులకునా చోటుధగదు స

దమలచరితా ॥ గీ॥ గృహముగట్టువానికిని యొప్పబడియున్న - గ్రహము పెక్కుబలము గలిగియున్న - యపుడు గట్టెనేని యమితభోగంబిచ్చు - ననుచు దెల్పెనయ్య ఫణికులేంద్ర ॥ సీ॥ వైశాఖ, మాఘ, శ్రావణ, కార్తికములను ఇలగృహంబులు గట్టవలెనటంచు - పక్షంబులను శుక్లపక్షంబునందున బలుగృహంబులు గట్టవలెనటంచు - జయశుభ తిధులొప్ప జనసంఘములు వాటి దెలశి గృహములుకట్టవలెనటంచు - భార్గవ బుధ బృహస్పతి వారములయందు దలపనిండ్లనుగట్ట వలెనటంచు - శతభిషంబు స్వాతి, శ్రవణ, ధనిష్ఠలు - హస్త, చిత్త, యుత్తరాత్రయంబు - పుష్యముల గృహంబు పూనికట్టందగు - ననుచు దెలుపబడియె ఫణివరేణ్యా ॥ కం॥ మృగశిర, రేవతి, రోహిణి - జగతిననూరాధ దప్పజల్లవు యిఖనే - నగుపరచెడి యోగంబులు - దగునిండ్ల కటంచుబలికె తక్షకవర్యా ॥ కం॥ వృద్ధి శుభశుక్లశోభన - శిద్ధపరీయాన్ను కర్త శివధృతి ధృవముల - నాధ్యాయుష్మాన్కులములు - కాద్యములనె గురువరుండు ఖగరాడ్వాహ ॥ గీ॥ ప్రీతిహర్షణంబు ప్రియముబ్రంహ్మేంద్ర సౌ - భాగ్య శిద్ధియోగబలములందు - గృహము లుంచగవలె కీర్తింపజనములు - గనుమునియె భుజంగ కాంతఘనత ॥ కం॥ ధరబవబాల వకౌలవ - వరతైతుల వణజిదప్పబరగవు ఇతరం - బురుదూషి తంబులనుచును - గురుజనములు బలికిరినియె కుండలినాథా ॥ గీ॥ శుక్లపక్షమున వసుంధరలోపుల - శుద్ధాదియునుంచి జ్ఞాడబహుళ - ప స్థగాషాకు ప్రశస్థమానని జెప్పె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ కం॥ ఆరంభించెటిలగ్నము - కాకేడిటపదిట క్రూరులరయగనున్న - ధారుణి గృహములుగట్టిన - తీరనిదోషములుయుండు దివ్యచరిత్రా ॥ కం॥ గురుశుక్ర మాధ్యములనుగ - ధరగ్రహబాల్య

మునస్వృద్ధదశలనుపేర్మిగా - మరిశూన్యములను గృహమే-ర్పరచుట
తప్పనుచుజెప్పె వన్నగముఖ్యా ॥ కం॥ ధరణిగాస్థిరరాసులరవి -
చరియించుచునుండునపుడు జనులుగృహంబుల్ - బరువడికట్టవ
మరువని - గురుతరముగజెప్పెనయ్య కూర్మవిదారా ॥ కం॥ గ
నలగ్నమందు శుభకరు - లొనగూడుకనున్న మేలుబొడముటుగాకు -
న్నను పతివయింటనైనను - దనరినమేలనుచుజెప్పె దండిబలా
ఢ్యా ॥ కం॥ గురుకవిలగ్నమునవిశా । కరుతోగూడంగనిండ్లు
గట్టినవైశ్యా - నరుభీతిగలుగదనుచును-కరమర్థిని దెల్పెనయ్య గదృ
వతినయా ॥ కం॥ గురుశుక్రులులగ్నంబున - బరగుచునభిజత్తుబు
ధుడు ప్రబలుచునుండగా - స్థిరలోనూరేండ్లాయు - ష్కరమైగృ
హమొప్పుననియె ఖగరాడ్వైరి ॥

## స్థలవర్ణనము.

కం॥ తెలుపుగలభూమిద్విజులకు - దలపగక్షత్రియులకెఱ్ఱభూమి
గు భువివై-శ్యులకెన్నపచ్చవర్ణము - గలభూమిశ్శుభంబటనెను క
ల్మషహరిణా ॥ గీ॥ నలుపుభూమి శూద్రకులజులకును శ్రేష్ఠ -
మగును బ్రాహ్మణులకు మరియునాల్గు - వర్ణములగుభూమిపనికి
వచ్చునుయని - దెలిపెగురువరుండు దివ్యచరితా ॥ గీ॥ క్షత్రి
యులకు మూడుఛాయలువైశ్యుల - కెలమి రెండు వర్ణములును
శూద్ర - వర్ణజులకునొక్కవర్ణమైనగుభూమి - మేలునిచ్చునని
యె ఖహిరతేజా ॥ కం॥ ఈవర్ణంబులుగలిగిన - తావులలోరు
చియు తియ్యదనమైయుండ - న్నెవర్ణజులకునైనను - కేవలముగ
శ్రేష్ఠమనియె కూర్మవిదళనా ॥ సీ॥ వగరుక్షాత్రజులకువైశ్యజు
లకు పుల్లుచేదు శూద్రులకిట్లు జెప్పుభూము । లొప్పుచుండెవరికి
యుప్పునేలొప్పును మరిమృత్తుగంధతామరసతావి । దనరంగద్విజు

లకు ఘనమందృఘోటక గజగంధములు రాజ గణమునకును । ఫల మివ్వనగువైశ్యకులజులకును పశుగణముధాన్యాది వాసనలు మేలు । చూడచూడభువిని శూద్రజాతమునకు । మదపు వాసనబహుమంచి నిచ్చు । నిటులభూమినెరిగినేర్పుచే గృహములు । గట్టవలయునని ము కలుషదూర ॥ సీ॥ నలుచదరము బ్రాహ్మణులకు స్థలంబైన కడుమేలొసంగు భూకాంతులకును - నిడివి త్రొమ్మిదిపాళ్లు వెడలుపుబరికింప నెనిమిదైయున్నను ఘనపుటంద్రము - కోమటులకు భూమికొలతనల్ వెడలుపు నిడివైన పాళ్లైనకడు శోభంబు - వడివెడల్పారు ముప్పాతికనిడుపారు శూద్రజాతమునకు శుభకరంబు- ఇటులభూమికొలత నేర్పాటుగావించి - యందుతూర్పు పడమరారుపాళ్ళు - జేశి వెనుక నొకటి ద్రోశి చేయండని - జెప్పెగురువరుండు సర్పరాజ ॥ గీ॥ ముందుమూడుపాళ్ళు ముదమొప్పవిడిపించి - మధ్యభాగమందు మనుజులెలమి - నిండ్లుగట్టమంచి నిచ్చుచుండునటంచు - బలికె పుడమిలోన పవనభక్షు ॥ గీ॥ జెనులు మోదమంద జెపుదుగర్తపరీక్ష - నెట్టులన్న కోరునట్టిస్థళము - నందుగుంట త్రవ్వినట్టిమన్నునుమళ్ళి - పోశిజూడుడ నెను భుజగనాథ ॥ గీ॥ మన్నుమిగిలెనేని మంచిఫలంబిచ్చు - మన్నుతగ్గకను సమత్వమైన - ఫలము భూమిలోన పరిపాటియని జెప్పె - సుఖమిసంగుమయ్య సుబ్బరాయ ॥ సీ॥ గర్తంబుపడమర గర్తమొక్కటి మూరలోతు దీసియు దానిలోననీళ్ళు - బోశి సూర్యోదయమున జూడజలమున్న తడియున్న కడుమేలు బడయనగును - వృత్తంబుననొక్క గర్తంబు గజమంతలోతు వెడల్పొక్కరీతిదీసి - ముద్దజేయగనైన నద్ధరమేలౌను కాకున్న ఫలితంబు లేకయుండు - గనుకనీపరీక్ష గనియట్టి స్థలమున - నిండ్లుగట్టవలయు నిలజనములు - దెలియనగునటంచు బలికెనుకదు క్షేమ - సుఖమొసంగుము

య్యె సుబ్బరాయ ॥ కం॥ తనలోగిలి కైవిడిస్థల - మునుగోన ను
త్తరము తూర్పు ముఖ్యంబగు ద - క్షిణ పడమర కోనగూడదు -
వినుమనియెను కరుణగలిగి విషధరిచంద్రా ॥ గీ॥ చంద్రుడున్న
రాసి స్థంభమునాటించి - వాససౌమ్యుడున్న రాసిబోశి - శుక్రు
డున్నరాశిజూచి యారాశిలో - కప్పుగప్పుమనియె ఖగవరారి ॥

### వాస్తుపురుషవిషయము.

సీ॥ పూర్వశిరమున వాస్తుపురుషు డారేడసనెనిమిదట మాసం
బులనుజలంగు - మార్గశీర్షము పుష్య మాఘంబులను యామ్య
శిరముబెట్టుగయుండు దిరముగాను - వసరఫాల్గుణాచైత్ర వైశాఖ
మాసంబులను పడమర శిరమొనరియుండు - మూడునాల్గయిదిం
ట ముదమొప్ప నుత్తరదిక్కు శీర్షముబెట్టి తేజరిల్లు - గనుకనతని
దృష్టిగనుపట్టుచోటను - పాదములునుయుండబడినచోట - నిం
డ్లుగట్టదగదు యిలజనులనిబల్కె సుఖమొసంగుమయ్యె సుబ్బరా
య ॥ శేషార్థం ॥ మరియు ౬-౭-౮ యీసంక్రమణాల తూర్పు త
లయున్ను, ౯-౧౦-౧౧ యీసంక్రమణాల దక్షిణతలయున్ను, ౧౨
౧-౨ యీసంక్రమణాల పడమరతలయున్ను, ౩-౪-౫ యీసంక్ర
మణాల నుత్తరతలయుపెట్టి ఎడమప్రక్కగా పరుండును గనుక
తానుగైకొన్న గృహక్షేత్రమును తొమ్మిదిపాళ్లుజేశి శిరస్సుదిక్కు
నుంచి దిగువకు మూడుపాళ్లున్ను పాదాలనుంచి యెగువకు మూ
డుపాళ్లున్ను తోశివేశి మధ్యనుండు మూడు పాళ్లలో శిరస్సున్న
తట్టు రెండుపాళ్లు విడవగా మిగిలియుండుస్థలము నాభిప్రదేశము
గనుక నట్టిస్థలములలో శంఖును యుంచవలయును.

### నవవర్గు.

సీ॥ ఇంటినిడివెడల్పు నంటహెచ్చగుణించ - క్షేత్రీకృతపదం

బు క్షితిని వెలయు - నాపదం బెనిమిదితో పట్టుగ గుణించి పదిరెంట భాగింపబడినసంఖ్య - ధనమానుమూడింట గుణియించి యెనిమిదింటనుపాలు గొనిరేని ఋణము దేలు - తొమ్మిదింటగుణించి తొలగక నేడింట భాగింపవారమై పరిఘవిల్లు - నారింటగుణియించి నపుడుముప్పదిచేత - పాలుదీశిరేని బరగుతిథులు - ఇటుల దెలియవలయు నిలజనులనిబల్కె - నిండుసుఖమొసంగు కుండలేంద్ర ॥ కం॥ ఎనిమిదితోడను పదమును - గుణియింపుచు నిర్వదేడిటను పాల్గొన్నను - గననగు నక్షత్రంబును - వినుమాయని బలికెనయ్య విషధరచంద్రా ॥ గీ॥ పదము తొమ్మిదింట పట్టుగా గుణియించి - ఎనిమిదింటపాలుగొనిన తాయు - మగునటంచుబలికె మహనీయమూర్తిసత్ - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ గీ॥ తొమ్మిదింటదాని నిమ్మహిగుణియించి - నూటయిర్వదిటితో భాటిమీర - పాలుగొనిన హాయాము పట్టుగాగాన్పింప - బడునటంచు బలికె పన్నగేంద్ర ॥ కం॥ ఆరిటపదము గుణించుచు - బారుగనది తొమ్మిదింట భాగారించ - న్నెరుపడు హంశగనుమని - ధారుణిలో జెప్పెనయ్య తక్షకవర్యా ॥ సీ॥ ధిక్పతిసంఘముల్ దెలియనాయుర్దాయ మెనిమిదింటనుపాలు గొన్నగనెగడు - ధ్వజశింహ్మావృషభ సామజములు మేలౌను పంక్తిర్వదికి పైననుండవలయు - ఐనను నాల్గు రెండారైనహాంశలు శ్రేయంబు ఇతరముల్ ఖాయపడవు - ధూమ్య్ర నైగతి వహ్నియనువారి నిడనాడని తంగి క్ష్పతిశుభంబిచ్చువాడు - ఇట్లు వర్గశుద్ధి నెరిగి ఇండ్లనుకట్ట - సిద్ధిశిద్ధులొసగి సృష్టుపరచు - ననుచు దెలిపెనయ్య ఘనుడగుగురువరుం - డమలమతిని ధరణిననఘచరిత ॥ సీ॥ వకటి మూడైదేడు వచ్చినట్లా - యనాపైధ్వజా ద్యాయముల్ పరిఘవిల్లు - రెండు నాల్గారెన్మిదుండ ధూమశ్వాన ఖరకాకములుగాను గణనకెక్క-

లగ్నములో మూడారు లక్షింపతొమ్మిది పన్నెండువిడిపించ పైవి
మేలు - స్థిరరాసులన్నను సింహవృశ్చిక కుంభవృషంబులనివిర్త పీ
గుచుండు - ఇవియుమొదలుగాను భువిలోననేర్పడు - వాస్తుశా
స్త్రరీతి వైనముగను - దెలిసియిండ్లు గట్టవలశిసదనిబల్కె - సు
ఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ సీ॥ ఇంటిదూలముపట్టెలెను
గాడ్లపరుపులు ఎత్తుచప్పుడు కొనల్ యుత్తరముగ। తూర్పుదిక్కుం
డ నైఋతుటమేలు ద్వారబంధపుపట్టెలలో తూర్పుదనుపట్టె। ముం
దెత్తినను మేలు ముదముతో దక్షిణపశ్చిమోత్తరముల పట్టెలర
యు। వరుసగానెత్తించవలయునొక్కటి తొమ్మిదైన రాసులు ద
గియలరువారు। ఇండ్లకునపరవాకిండ్లనుంచుట మేలు రెండారు
పదియారాచునుండువారు। యుత్తరవాకిండ్లనుంచుటమంచిదిజూడ
పదొండుమూడేడురాసు। లనుయుండువారు తూర్పునవాకిలుం
చంగవలయు నాల్గెనిమిదిదలపగాను। పంద్రెండనేరాశి ప్రబలేటి
వాండ్రకు దక్షిణవాకిండ్లు దగునుతురియు। నిలతలవాకిండ్ల నెరి
గించెదనునాల్గు పన్నెండునెనిమిద వదనురాసు। లనువారు దక్షి
ణంబునను వాకిండ్లుంచవలయును రెండేడుపదనకొండు। రాసులు
గలవారు వాశిగాపడమరవాకిండ్లు పెట్టుకోవలయుఘనత। నై
దు తొమ్మిదినొక్కటైనరాసుల వారలుత్తరంబున నుంచనుత్తమ
వని। మూడునారుపదియుజూడ రాసులవారు। తూర్పుతట్టుద్వా
ర మేర్పరించ। వలయుననుచుబలికె వాశిమీరంగను। సుఖమొ
సంగుమయ్య సుబ్బరాయ॥ సీ॥ ఇలువాకిలైనను తలవాకిలైన
ను పాగాదిదిశలనేర్పడెడుదిక్కు। నెనిమిదిభాగాలుగనుజేశి యం
దారిటను నైదిటను నాల్గిటను ప్రతిష్ఠ। జేయంగదగును పశ్చిమ
మందిరమునకు తూర్పువాకిలి మేలు తూర్పుఇంటి। కిని పడమర
దిక్కునను యుత్తరపుఇంటికిని దక్షిణముచవాకిండ్లు ఘనము। లో

గిలందునీళ్లు బాగుగానుత్తర । వైపుగానితూర్పు వైపుగాని । పా
రవలెనటంచు బలికెనుకడుపేర్మి । సుఖముసంగుమయ్య సుబ్బరా
య ॥ సీ॥ జలకంబునకుతూర్పు జ్వలనుదిక్కున వంటకును దక్షి
ణముపండుకొననినిరుతి । పూలయందాయుధములకును జూడం
గనగు పడమరభోజనంబునకును । వాయువ్యమున ధాన్యవర్గంబున
కు నుత్తరము పశువులకు మారసుణుదిశను । దేవతారాధన గా
వించునటు ఇండ్లనుంచ మంచిదియని పించుమరియు । వంటపోయి
లు హోమ వరగుండములు జేయ - కుజునిదినమునందు క్రుత్తిక
యనె - తారయుండగాను ధరణీసుతుడులగ్న - మునను యుండ
వలయుననె ఫణీంద్రా ॥

## శల్యపరిక్షు.

సీ॥ వినుముశల్యములుండు విధమెరింగించెద నదియును
తొమ్మిది గదులుయుండు నటుల చక్రముద్రాసి నాణ్యంబుగా
తూర్పు గదిమొదలష్టవర్గ ములనేటి - యకచటతపయశల మరిం
చినది గదియందున హాపయయర్ణ అక్షరములు - వ్రాశిప్రశ్నకువ
చ్చువాడు బల్కెటిమాటకాది యక్షరవర్గమేదో దాని - దెలిసి
వానిఇల్లుగొలిచి పైచక్రము - లోనబలుకు స్థలమునూనిత్రవ్వి -
రేనిశల్యసమితి గానంగబడునని - బలికెగురువరుండు పన్నగేంద్ర॥
గీ॥ మొదటివర్గమైన మూడుమూరలలోతు - జనులహారమైన
చర్మ శల్యములను - దీయవచ్చునయని బాయకభువిలోన - జె
ప్పెగురువరుండు సర్పరాజ ॥ గీ॥ రెండవదనువర్గ రెండుచేతుల
లోన - రాజదండనంబు రమణదెచ్చు - గాడ్దెఎముకలుండి గాన
వచ్చునటంచు - కరుణగలిగిబలికె ఖగవరారి ॥ గీ॥ వడినిమూట
పైననడుములోతునవ్యాధి - నమరజేయునట్టి నరునిఎముక - లుం

దునంచుభువిని ఖండితముగ జెప్పె సుఖమొసంగవలయు సుబ్బరాయ ॥ గీ॥ జూడనాల్గుదైన మూడుమూరలలోతు - కుక్కఎముకలుండి కట్టువారి - కనయమునను వ్యాధి గలిగించునని బలికె సుఖమొసంగవలయు సుజనపోష ॥ కం॥ ధరనైదవ వగోకటిన్నరచేలోతునను తనకునష్టము దెచ్చె - చిరుతనరు లెముకలురువడి కరవడునని బలికెనయ్య కలుషవిభంగా ॥ కం॥ ఆరిటనలు చేతులలో - వారకబొగ్గులునుయుండ వనరహితులరుగ - ధారుణిలో హానిదెచ్చెటి - కారణమనెకర్మణజూడు ఖగరాడ్వారి ॥ కం॥ ధనహానము ఏడవవ - ర్గుననడుములలోను నందుకుంభినిలో బ్రాహ్మణ ఎముకలుండు నిజమని - ఘనతరముగ జెప్పెనయ్య కద్రువతనయా ॥ కం॥ గోవెముకలు వకటిన్నర - చేవయిపున భూమిత్రవ్వ చెలగున్నిరునా - ల్గోవర్గున వశుహరణము - గావచ్చునటంచుబలికె కరికరదమనా ॥ గీ॥ మద్యరోమ్ములోతు మనుజుని తలపుర్రె - యైనభూది లోహమైనగాని - కులమునాశగింప కూడియుండునటంచు - బలుకబడియె ధరణిపవనభక్ష ॥

## జలవాస్తువు.

సీ॥ వాపికూపంబులు సరతటాకంబులు వేయింపజలప్రశ్న జేయువేళ - తిథివారమశ్వినాదిగ తారసంఖ్యలు గదియించి మేషాదిగానుసంక్ర - మణాలసంఖ్యను జేర్చిగుణిక మేడిటజేశి యెనిమిదింటను పాలుగొనిన శేష - మొంటకౌరజలంబు రెంటనిర్జలమాను మూడునిల్వగచట్టు రూఢిపడును - నాల్గు శేషమైనవనీ తలమునందు - స్వల్పజలమటంచు బల్కబడియె - నైదుమంచినీళ్లు నైయులరునటంచు - దెలిపెనాథునందు దివ్యచరిత ॥ కం॥ ఆరేడనిమిదియైనను - కోరినరుచిస్వల్ప జలముగొప్పగురాళ్లుగ - బా

రుగగనుపడుచుండెటి - కారణమని చెప్పబడియె కరుణాభరణా ॥ సీ॥ తెలుపువస్త్రమువలె తేనెవర్ణమువలె భ్రమరహేమముమా క్తికములనలెను - రాళ్ళుగల్గిననేల నీళ్ళుమంచివిబడు ముద్గర్ణవై ఘూర్యములు హరిదళ - మనదగు రాళ్లనేలను మిక్కుటంబగు జలముండు నున్నపుశిలనుజేరి - మన్నెర్రగా నల్లమన్నుగా గాన్పింపనచోట బహుజలంబనిరిబుధులు - పుడమినెల్లిమట్టి పొన్నగంటియుతిప్ప - తీగెదర్భనూశ తీగెలున్న - బిల్వతరువులున్న ప్రియమైనజలమని - బల్కెగురువరుండు పవనభక్ష ॥ కం॥ ఆకులుదట్టపుర్రమాకుల - నేకమ్ములై ఎచటనున్ననీళ్ళచ్చటనో - లోకింప పుష్కళముగా - లోకంబున వెలయుననియె లోలతనభవా ॥ కం॥ కోమలఖర్జూరములును - తామరకానుగలు నేల తామరలును ప - శీమను దగునూజలమా - భూమినిఎడతెగకనుండు భుజగశ్రేష్ఠా ॥ గీ॥ కపిలధాతుశితకాంతి భూములలోన - నీళ్ళువుప్పు జవ్వనీళ్ళు మంచి - నీళ్లుబడును జూడనిచ్ఛయమని జెప్పె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ గీ॥ భావిత్రవ్వముందు పదిరెండు యంగుళా- ల్లోతుదీసి దానిలోననీళ్లు - బోశిసంధ్యవేళ ప్రొద్దుననేజూడ - వలయుననుచుబలికె వాసుకేంద్ర ॥ కం॥ గోద్దిగజలముగుపడగా - నద్దరణిని పూర్ణజలమనందగు తడిగా - కుర్దియుతగ్గు జలమని - పెద్దలువర్ణింతురనెను భీకరరూపా ॥ సీ॥ గ్రహచక్రమ్మునువేసి క్రమముగా గదులందు నెనిమిదొండాగును నేర్పుమీర - మూడునైదేడ్నాల్గు ముదమునతొమ్మిది రెండువేయందగు ఖండితముగ - వృశ్చికుడార్పించు ప్రియమైనగదియెక్క గ్రహఫలంబెరుగుట ఘనముమరియు - ప్రశ్నవేళకు సరిపాదచాయలు వేశియందిర్వదెనిమిది పొందుపరచి - పట్టుగాను దాని పదిరెంటగుణియించి - పాలుతొమ్మిదింట పడగ శేష మిలజలంబు

యుండు స్థలమొసంగందగు - నను చుబల్కె నయ్య ఫణికులేంద్రా॥ గీ॥ నకటిశేషమైన నకటొగదినియంట - పదియురెండు మొదలు పదియునారు - మూరలలోతూర్పు పూర్ణజలంబని - బలికెపుడ మిలోన పన్నగేంద్రా॥. కం॥ పదిరెండుమూళ్లనుంచియు - పదహారిటివరకు జలముపవనునిదిశగా- పదిలమునవ్వెడలు రెంటను - విధిఇదియని బలికెనయ్య విషధరచంద్రా॥ గీ॥ మూటమునిషి లోతు భూమిలోపలనుంచి - రెర్కుమట్లవరకు నిండునీళ్లు - యుండనగునటంచు ఖండితముగబల్కె - సుఖమొసంగునలయు సుబ్బరాయ॥ గీ॥ నాల్గుమట్లక్రింద నయముగానుత్తర దిక్కునుండి జలముమిక్కుటముగ - నడుచునను చుబలికె నాల్గుశేషంబైన - సుఖమొసంగవలయు సుబ్బరాయ॥ కం॥ ధరనాల్గుమట్లలోతున స్థిరమైజలనాడి రుద్రదిశనుంచివడిగా - బరతెంచుపూర్తినైదిట - కరయుండదటంచు బలికె నమలచరిత్రా॥ కం॥ స్థిరనారుఫలము నల్వురి - పురుషులలోతునను జలము పూర్తియునదగుగా - యురు జలమేడిటగాంచుట- కరుదనియె భుజంగనాధకనికరమొసగగా॥ కం॥ నల్లటిరాల్ స్వల్పజలం । బుల్లశిలున్ననిమిదింట భువితొమ్మిదిటగా । జల్లనగునను తుసద్గురు । వల్లభుడనెవ్యాళవంశ వారధిచంద్రా॥ గీ॥ భావిత్రవ్వస్థలము పశ్చిమోత్తరములు । దిశలతూర్పు రుద్ర దిశలత్రవ్వ । వలయునను చుబలికె వాశిమీరంగను । సుఖమొసంగవలయు సుబ్బరాయ॥

## భావులకు ముహూర్తము.

సీ॥ వ్రతులకు సుముహూర్త పద్ధతివివరింతు శ్రవణంబు మఖ యనూరాధహస్త । రమణరేవతి యుత్తరాభాద్ర రోహిణి పుష్యముల్ దగు 'లగ్నములనుగాంచ । కటకంబు మీనమకరములు

మేలౌనుకుంభమువృషభముల్ కొద్దిఫలము। లగ్నకేంద్రములందు లక్ష్మింపచంద్రుండు శుక్రుడున్ననుమేలు సూటిపరచు - రవియురవి సుతుండు రాహువుకుజులున్న - జలమువడదటంచు బలుకబడు ను - గానఇటులదెలిశి గావింపనగునని - పలికెగురుపరుండు పన్న గేంద్ర॥ శేషార్థం॥ లగ్నమునకు ౧-౪-౭-౧౦ యీస్థానము లు కేంద్రములు॥

గృహప్రవేశము.

సీ॥ నూతనగృహమందు నుర్విలోజనములు జేరేటిముహూర్తం బు జెప్పెదువిను - రెండుమూడును పదకొండు పంద్రెండను మాసంబులనుజేర మంచిదనని - వకటిమూడేడను వారముల్ గూడవునాల్గుతొమ్మిది పదునాల్గు ముప్ప - దనుతిథుల్వర్జిపించ త క్కినయవిమేలు తారలం దుత్తరాత్రయము మేలు - రోహిణిమం చిదేనూహింప పూర్వగృహములందు జేరనుగమనముపడి - రేని తారలందు రేవతి జ్యేష్ఠాను - రాధలైనమేలు ఈధరిత్రి - నిటుల ఘనులమతము నెరిగి జేరందగు - నంచుదెల్పబడియె నహీకులేంద్ర॥

నూతనవస్త్రధారణము.

సీ॥ క్రొత్తగుడ్డలు కట్టుకొనువారలకు నిందునుముహూర్త క్రమమును సూటిపరతు - పదునాల్గు నాల్గుముప్పది పదహారు తొమ్మిది సెుక్కటియు నెనిమిదియనేటి - తిథులద్రోయగవలె గ దశినాల్గయిదారు వారముల్ జేర్చ్చి కోపలెధనిష్ఠ - యుత్తరాత్ర యమును చిత్తహస్తస్వాతి పౌనర్వసాశ్విని పౌష్యమియును - శత భిషానూరాధ క్షితినిరేవతి మృగశిర రోహిణియుమూల శ్రవణ ములును - శుభకరంబుమరియు జూడవైధృతివ్యతీ- పాత్తుపరిఘ లొప్పబడవుగనుక - నిటులదెలియుమనెన కుటిలమానసుడగు -

గురువరుండు గడమికుండలేంద్ర ॥

క్షౌరమునకు.

సీ॥ క్షౌరంబునకుదగు కాలము న్నెరిగింతు జూడగానేడైదు మూడురెండు - పదమూడనే తిథుల్ భవ్యకరంబగు వారంబులందు నైదారురెండు - నాల్గును మేలివ్వనగు మృగశీర్షంబు పౌనర్వసాశ్వని పౌష్యమియును - శ్రవణచిత్తధనిష్ఠ శతభిషంబువిశాఖస్వాతి హస్తలును ప్రశస్తమ్మగును - జేష్ఠరేవతియును క్షితిలోమధ్యమ ఫలం- బౌనుఇట్టిముహూర్త ప్రకరణంబు - కొన్నివేళలందు నెన్నంగదగదని - ముచ్చటించెనయ్య భుజగవర్య ॥

అభ్యంగనము.

గీ॥ మూడుతొమ్మిది పదమూడు రెండొండైదు - నేడనేటితిథులుగూడముఖ్య - ములవిజెప్పె జలకమ్మునునాడ కడుప్రేమ - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ కం॥ వారములను నాల్గేడగు - వారములను వీడిరేని వసరగుసంచుల్ - ధారుణిబీజావాపన - కూరిమినెరిగింతునసేను కోమలగాత్రా ॥

బీజావాపనము.

కం॥ పదకొండైదేడునుమూ - డ్పదియేన్పద మూడటంచు బరగెడి తిథులు౯- పృథివిలోబీజావాపన - కదుపీగునవిబలికెనయ్య ఖగరాడ్వైరీ ॥ కం॥ ఉత్తరరోహిణిరేవతి - హస్తముఖాశ్లేషమూలయనురాధయును౯,- స్వాతిశ్రవణము ఘిక్కలి - ప్రీతి కరంబనుచుబలికె భీకరరూపా ॥ కం॥ వరపుష్యమిపూర్వాషా- డరయను విత్తనములిడుట కధునగునుధర౯ - స్థిర వారలగ్న మెరుగన్విర విరచింతునటంచుజెప్పె విమధరచందారి ॥ కం॥ స్థిరనుభానుదివస శింహ్మాలగ్నమునందు - సర్వవిత్తనములు నిర్వహించి -

నాటిననుఫలింవనగువృధాపోదని - జెప్పబడియెగురుడు సర్వరాజా॥ కం॥ హిమకరునిదివసమున మిధు - నమునగ రాజనపు విత్తనము లెదబెట్టగ - యమితఫలంబందుదురని- సుమనసవిభుడనిగొనయ్య సుబ్రంహ్మణ్యా॥ కం॥ ఒండేడెనిమిదిలగ్నము - లుండగశుజదిన ము కొత్తిలున్న ఎదబెట్టగ - పండునఖండముగానని - ఖండితము గ బల్కెనయ్య గరుడవిపక్షా॥ కం॥ బుధుదినము మిధునకన్యల పృధివిలోపూగిఫలంబు పెంపుగ్గనాటగ - వ్యర్థబోదు మిగులఫలి తం - బదియొసగునటంచుబలికె పన్నగముఖ్యా॥ గీ॥ ధనువు మీనములను ధరగురుదినమున- నామ్రబీజమాదిగాసమస్త - విత్త సముల్లువేయ నొత్తుగానుఫలింపు - గానుపించుననియె కల్మష హార॥ కం॥ ఆరవవారము వృషభతులారయగా పూలచెట్ల క తిచేపాఇ - ద్ధారుణిలో నని దెలియుము - సారంబిదియనుచుబ ల్కె సాహస్రఫణా॥ గీ॥ మకరకుంభలగ్న మమరగాశనిదిన - మశితదాన్యములను మహినినాట - గొప్పఫలితమనుచు జెప్పెను కడుప్రేమ - సుఖమొసంగవలయు సుబ్బరాయ॥ కం॥ గురుశు క్రచంద్రులునువడి - సురచిరలగ్నమునయున్న జూచినధరలో - సురుతరఫలమందు దురని - కరమర్ధిని జెప్పెనయ్య కద్రువతనయా॥

## స్త్రీలరుతువిషయము.

గీ॥ స్త్రీలుఋతువునంద్ను వేళ శుభాశుభ - చిహ్నములను జూచిచెప్పటకును - వచనరూపకముగ వ్రాయింతుననిబల్కె - నిం దుసుఖమొసంగు కుండలేంద్ర॥ శేషార్థం॥ స్త్రీలరుతువిషయ ముగురించి మాసములలో చైత్రమందు వైధవ్యము - వైశా- ధనపుత్రులు - జ్యే- రోగవతి - ఆషా- సంతునష్టము - శ్రా- ధ నవతి - భాద్ర- దుర్భగ - ఆశ్వీ- తపశ్శాలి - కార్తీ- అల్పాయువు

మార్గ, బహుసంతు, పు, జార, మాఘ, పుత్రవతి, పాల్గు, సంపద పుత్రగతియగును। తిథులలో ౨, 3, ౫, ౭, ౧౦, ౧౧, ౧3, ౧౫ యీతిథులున్ను, వారములలో సో, బు, గు, శు యీవారములున్ను, నక్షత్రములలో అశ్వ, రో, మృ, పుష్య, హ, చి, స్వా, అనూ, వి, మూ, శ్ర, ధ, శ, వుత్తరాత్రయమున్ను, లగ్నములలో—౨, 3, ౪, ౬, ౭, ౯, ౧౨, యీలగ్నములున్ను, లగ్నమునకు ౨, ౪, ౫, ౭, ౯, ౧౦ యీస్థానముల శుభగ్రహములున్ను, 3 ౬, ౧౧ యీస్థానముల పాపగ్రహములున్ను వున్నయెడల శుభకరము, మరియు అశుద్ర, జ్యే, పున, మ, కృ, ఈనక్షత్రములయొక్క మొదటిపాదములలో సమగ్రైనయెడల శుభము, ౨, 3 పాదములైన యశుభము, భరణి, పూర్వాత్రయములలో నాల్గవపాదమున శుభము, తక్కినపాదముల నశుభము, దుష్టనక్షత్రములందు ప్రథమ రజస్వలయగు స్త్రీకి ముందుగా నక్షత్రశాంతిని జేశి తర్వాత శుభనక్షత్రమందు రజస్వలయైన పిమ్మట గర్భాదానముహూర్తము నిశ్చయించుట శుభము, చంద్రుఢు కూరినక్షత్రములందున్ను సూర్యుడు శుభనక్షత్రములందుండగా రజస్వలయగు స్త్రీకి దోషము లేదని దెలియదగును ॥ గీ॥ ఇటులరుతువిధంబు నెరిగిగర్భాదాన । మందుపై విధించు టందులకును । దెలియనగునటంచు బలికెను కడుప్రేమ । సుఖముసంగుమయ్య సుబ్బరాయ ॥

## నిషేకముహూర్తము.

శ్లో॥ నిషేకముహూర్తమందు విచారించగా తిథులలో ౬, ౮, ౪, ౧౫, ౧౪, 30 ఈతిథులన్ను దోషయగా మిగులు తిథులున్ను, సో, బు, గు, శు యీ వారములున్ను, నక్షత్రములలో శ్ర, రో, అనూ, స్వా, రే, మూ, వుత్తరాత్రయమున్ను, లగ్నములలో

౨-౩-౪-౫-౬-౭-౯-౧౧-౧౨ ఈలగ్నములున్న, శుభకరంబులు. యెనిమిదవస్థానమున యేగ్రహమున్ను యుండకూడదు. పుష్య, ధ, మృ, అశ్వ, చి, పున, ఈనక్షత్రములు మధ్యమము తక్కినవి అధమము ॥

శీమంతము.

గీ॥ స్థిరనిషేకమైన శీమంతమన్నుఖర్త - జగుపవలయునంచు జనముమెచ్చ - నెనిమిదారునాలుగను మాసములలోన - ననుచుదెల్పెనయ్య ఫణివరేణ్య ॥ కం॥ తిధిరెండు మూడునైదను - పదిపదమూడేడు శుభము వారములరియక - విధిరెండైదా ర్నాలుగు - పృధివిలో శుభమనుచుబలికె భుజగశ్రేష్ఠా ॥ గీ॥ వృత్తరాత్రయంబు పుష్యపునర్వసుల్ - జగతిరోహిణియును శ్రమగశిరయును - రేవతియును లెస్సభావింపగానని - బలికెగురువరుండు పవనభక్ష ॥ గీ॥ శి హ్వానృశ్చికములు శీమంతమునకందు- బడవుసింగులు నవియుకడుశుభంబు - లగునటంచుబల్కె జగతిపైకడు ప్రేమ - నన్ను బ్రోవనలయు పన్నగేంద్రా ॥ శిశువిమార్శ॥ గీ॥ రిమణిపేరు యక్కరముల నేకిటబెంచి - తిధినిగల్పితొమ్మిదింటపాలు- గొన్న బేశిసుతుడుకన్నె సమంబని - జప్పవచ్చునని యె సర్పరాజ ॥

జననవిషయము

సీ॥ మూలనుఖాశ్వని మొదటిపాదంబులు జ్యేష్ఠరేవతియు నాశ్లేషలందు - నంత్యపాదంబులక దగ్భకల్ గలుగ నత్యుగ్రగండములనిదోచనగును - మరియురోహిణిపూర్వ భాద్రమూలాశ్లేషపౌనర్వసులునాల్గు పాదములును - శాంతులకర్హమై జలగురోహిణి మేనమామగండంబని భూమినొప్ప - మూలశ్వశు రగండమును దె

చ్చు తక్కిన - తారలెల్లకీడు తనకుదెచ్చు - గానదెలియవచ్చు కడుపేర్మితోబలికె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ సీ॥ గ్రహదోషనెళవుల గాన్పింతు చంద్రుండు ఎనిమిదింటనుకుజుడే డేటలర - సూర్యుడైదవఇంట శుక్రుడారింటను గురుడు పండ్రెండింట నరుణసుతుడు - ఒంటున బుధుడు మూడింట్రరాహువు తొమ్మిదింటనంటిన దోషమంటునిజము - చంద్రసూర్యులచేత జననీజనకు చేటు తక్కిన వారిచే తనకుచేటు - గలుగునను చుదెలిసి ఘనులు శాంతికిరగు - క్రియలొనర్చవలయు ప్రియముమీర - ననుచుజెప్పె భువినిజనులిదవిని మెచ్చ - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ శేషార్థం ॥ మేషములోజనియించిన చోరత్వము, వృషభములో విభవము, మిథు, గ్లాని, కర్కా, ధనము, శిం, భూప్రాప్తి, కన్య, విఖ్యాత్తు, తు, మంత్రిత్వము, వృశ్చి, దరిద్రము, ధ, గ్లానము, మ, దుష్టత్వము, కుం, వ్యాపారము, మీన, విద్వాంసుండగును. జననమైనరాసిలో సూర్యుడున్న రాజ్యమును, చం, క్రుషిని కుజు, వీరుడున్ను, పాపిన్ని, బు, నీతియుగ్జానమున్ను, గురుశుక్రులున్న, ధీరత్వమున్ను, శ, చోరత్వమును, రాహు, పుదారతయు, కేతు, దరిద్రమును ఇచ్చుచుందురు. మరియు జన్మలగ్నమునగా ౧-స్థానముగాన ౧-౪-౭-౧౦ యీస్థానములు. కేంద్రములు. ౫-౯ యుపికోణస్థానములు గనుక నీస్థానమ్ములందు బుధ గురు శుక్రులుండగా జన్మించిన శిశువుకు దీర్ఘాయువుగాను ౨-౩-౧౧ ఈస్థానములందు వీరలుండజనించినమధ్యమాయుగాను ౯-౮-౧౨ యీస్థానములందుండగానల్పాయుగాను వూహింపబడుచున్నది. రవి కుజ శనిరాహు కేతువులు క్రూరులుగావునవీరు కేంద్రపంచమాష్టములయందుండినను శుభకరులనిపించరు - సూర్యశిద్ధాంత గోళాధ్యాయములో సూర్యచంద్రులు అష్టమాధిపతులైనను మారకులు

బాధకులుగారని జెప్పియున్నది. లగ్నము రెండుభాగములు జేసిన హోరాయగుచున్నది. అందున మొదటిది మేషాదిబేసిరాసులలో చేర్చి మొదటిభాగము సూర్యహోర - వృషభాదిసమరాసులలో చేర్చి మొదటిభాగము చంద్రహోర - లగ్నంమూడుభాగములు జేశ్చి ద్రేక్కాణము - అందు మొదటిభాగమునకు ఆరాసిఅధిపతే యగును - రెండవభాగానకు అయిదవఇంటి అధిపతియగును - మూడవభాగానకుతొమ్మిదవఇంటివాడగును లగ్నముతొమ్మిదిభాగ ములు జేసినగాన వాంశయగుచున్నది - అందున మే, సిం, ధ, వీటి లోలగ్నమైన యడ మొదటిభాగానకు మేషముయొక్క అధిపతే యగును - రెండవభాగము వృషభాదిపతి - మూడింట మిధునా ధిపతి ఇదేపరుసను తొమ్మిదిభాగములకు నగుచున్నది - వృ, కన్య, మ, ఈలగ్నములంటైతే మొదటిభాగమునకు మకరాధిపతి ౨ కుం భాధిపతి - అదేపరుసనజూడవలెను- మిధు, తు, కుంభములోలగ్న మయ్యేనేని - మొదటిభాగమునకు తులాధిపతిమొదలుగా చూచు కునేది కటక, వృశ్చి, మీనములలో లగ్నమయ్యేనేని మొదటిభా గానకు కటకాధిపతిమొదలుగా చూచేది - లగ్నము ౧౨ భాగ ములు జేయగా ద్వాదశాంశయగుచున్నది అందు మొదటిభాగము నకు ఆలగ్నాధిపతేయగును - అది ౧౨ భాగములకు ఆయారా సుల అధిపతులేయగుచుందురు లగ్నము 30 భాగములుచేశ్చి త్రింశాంశయనంబడును - అందున మొదట ౫ కి కుజుడు పైన ౫ కి శని పై ౮ కి గురువు పై ౭ కి బుధుడు పై ౫ కి శుక్రుడు అ ధిపతులగుచుందురిందులో బేశిరాసులందులగ్నమైన యెడల కుజు డుమొదలుగాను సమరాసులందులగ్నమైన యడల శుక్రుడు మొ దలుగాను చూచుకొనేది - గ్రహదృష్టి శని 3-౧౦ ఈస్థానము లు పూర్ణదృష్టిచే జూచును - తక్కిన గ్రహములు పాత్యాదృ

ష్టిచేజూతురు గురువు ౫-౯ స్థానముల పూర్ణదృష్టిన చూచును తక్కినగ్రహములు ఆస్థానములర్ధదృష్టిచేజూతురు - కుజుడు ౪. ౮ స్థానములు నిండుదృష్టినిజూచు - తక్కినగ్రహము లాస్థానముల ముప్పాతిక దృష్టిచేజూతురు - అన్నిగ్రహములు ౭ వస్థానమును నిండుదృష్టిచే జూచుచుందురు - సూర్యునకు మేషం - చం. వృష - కు మక - బు. కన్య - గు. కట - శు. మీా - శ. తుల ఉచ్ఛలని తెలియవలెను- ప్రతిగ్రహమునకు ౬, ౮, ౧౨ ఈ స్థానములు శత్రుత్వము తక్కినవి మిత్రత్వము ॥

లగ్నఘటికపరిమానము

మీా. మే. ౪ ఘ - వృ. కుం. ౪౪ ఘ - మిథు. కన్య తు. మ. ౫౹ ఘ. కట. శిం. వృశ్చి. ధ. ౫౪ ఘడియలనబడును. శిం. సూర్యుడు. కట. చం. మే. వృశ్చి. అంగారకుడు. మిథు. కన్య. బుధుడు. మీా. ధ. గురువు. తు. వృష. శుక్రుడు. మ. కుం. శని అధిపతులగుదురు ॥ జాతకర్మ—అన్నప్రాశనము—సీ॥ నాల్గువర్ణములవార్నామకరణమును నొనరించదగునట్టి దినములుయ । పదకొండు పదిరెండు పదునారు నిరుపదిరెండు నిర్వదియనిదండినెగడునట్టివేళలయందనగు జాతకర్మంబటంచు నన్నప్రాశనమున పురుష । శిశువుకారెనీమిది స్థింపదగ పదిరెండు మాసముల్ దగియుండు మగవలకును । పదనకొండునైదు పట్టుగ్గాత్తొమ్మిది । మాసముల నొనర్ప మంచిదవేని । తిథి..మన్న నిండు దెలియజేసెదనంచు । బలికె కరుణావ్యలన పన్నగేంద్ర ॥ కం॥ రెండైదుమూాడు నేడును । దండిగ పదునాల్గు పదియు ధరపదమూాడుగా । మొండుశుభస్కరమని బహు । ఖండితముగ బలికెనయ్య కన్ననతెనయా ॥ చెవులుకుట్టుటకు—సీ॥ ఉత్తరాత్రయుయును చిత్తహస్త స్వాతి శ్రవణ మానూరాధ శతభిషజంబు । అశ్వధనిష్ఠ పుష్యముకోహిణి పునర్వసు మృ

గశిరయు రేవతికిదప్ప । నన్యమొప్పవు లగ్నమూగు తొమ్మిది నా ల్గు రెండును మూడు పం డ్రెండు మేలు - భువిలగ్నముకు పదియవ స్థానమే గ్రహముండ గూడదయనె ఖండితముగ - చెవులుకుట్టు టకును జెప్పెను తిధులలో - మూడునైదును పదమూడు రెండు నేడును పదిమేలుగూడునిజంబనె - సుఖమొసంగుమయ్య సుబ్బ రాయ ॥ కం॥ వారము లెరిగించెద నా - ల్గారైదును రెండు భ వ్యకరమగుననుచు - తారలు హైనోందనము ప్ర - కారంబనె సు బ్బరాయ కరుణాభరణా ॥ కం॥ ఐదేనిమీది పదకొండుకు - పై దగులగ్నములుమిగుల భవ్యంబగుల - గ్నాద్యష్టమ శుధ్యగయక- గాదనెగ గరుణజూచు ఖగరాడ్వాయిరీ ॥ పుట్టు వెంట్రుకలుదీ యుటకు——గీ॥ ఇలనుపుట్టు వెంట్రుకలుదీయపదిపద । మూడునై దు రెండు గూడుతిధులు । నైదు రెండునాలుగారు వారములివి । మేలటంచుజెప్పెవ్యాళచంద్ర ॥ గీ॥ శతభిషంబు స్వాతిశ్రవణధని ష్ఠయు । మృగశిరాశ్వనియును రేవతియును। పుష్యపునరువసులు పుడమిలోనుత్తమ । మనిరిబుధగణంబు ఫణివరేణ్య ॥ అక్షరా భ్యాసము——గీ॥ అవనిపంచమాబ్ధ మందక్షరాభ్యాస । మును నొన ర్చినలయు మూడునైదు । నేడుమరియును పదమూడు తిధుల యందు । జేయవచ్చునని యొ క్షితిఫణీంద్ర ॥ కం॥ గురుశుక్రసౌ మ్యసోములు । వరహస్తాగుద్ర చిత్తస్వాతి యనూరా । ధనియపు నర్వసు శ్రవణము। లరలేగ శుభంబొసంగునని భుజగేంద్ర ॥ కం॥ గనలగ్నమునకునైదిం । టను యోగిహ్యముండదగదు తాయిగనిఖనే। వినుపించెదను పనయనము । విన వేడుకగానట నెను విషధరచంద్రా॥

వుపనయనము.

గీ॥ సోమశుక్రసౌమ్య సురగురు వారము । లకస్యమిధునము?

మఘ కటకమీన । మేషతులలు మేలుమిగులు కూడవటంచు । బల్కెగురువరుండు పన్నగేంద్ర ॥ సీ॥ ఉత్తరాత్రయమును చిత్తహస్తస్వాతి శ్రవణమశ్వని ధనిష్ఠయునుపుష్య । మియు మృగశిర రేవతియు పునర్వసు రోహిణియు ననూరాధల నెంచిజూడ । శుభములగ్నాష్టమ శుద్ధియేర్పడవలె రవిశనికుజులుండు రాసులుదగ । వితరగ్రహంబులు హితమతి కేంద్రకోణములనున్నను శుభంబమరుధరణి । కుజుడురవియు శనియుగోనకోని మూడారు । పదనకొండు ఇండ్ల బరగుచుండ । వలెననటంచుజెప్పె వడకముహూర్తమునకు । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ గీ॥ శనియులగ్నమంనుష్టమద్వాదశ । మందుయున్న శుభము నొందరవని । నశుభదినము లేవిపొసగవిందులకని । జప్పబడియెభువిని సప్పరాజ ॥

ప్రయాణమునకు.

సీ॥ వినరోరి దెల్పెద జనసంఘముర్విలో గమనపద్ధతిని ముఖ్యముగ నెరుగ - వలెనెట్టులన్నను వనరఁగతిధులలో రెండుమూడైదేడు ఖండితముగ - పదిపదకొండును పదమూడు పదునాల్గు పదహారు నుత్తమంబౌచుప్రబలు - వారము లెరిగింతు వడిరెండునాల్గారు వారములకు వినావదగదేవి - వారశూలలరయ వడిమీరరెండేడు - వారములను తూర్పువెపునకును - శూలలనుచుజెప్పె సూరిజనము మెచ్చ - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥
సీ॥ ఐదేడు వారములాగ్నేయమునకును దక్షిణమున్నకెకు దగదుమరియు - నారింటరెంటింట నైరుతికిని నొంటనారింటపడమర నయము లేదు - వనర నొక్కటమూట వాయువామూలకు మూడాలుగుత్తరమునకుదగదు - ఇలలోననాల్గింట నీశాన్యమునకునుబోయిన దుష్ఫలంబునబెనంగు - నిట్టివారములను ఈదిక్కులకుబోవ-

దగదుశూలలుండు ధాత్రిలోన - వీటిదెలిసినడువ విభవమందు ను
రని - జెప్పెగురువగుండు శ్రీకరఫణా ॥ సీ॥ భానుశుక్రులందు
పదిహేనుఘడియలు శనిసుధాకరులను ఎనిమిదియును - భౌమసౌ
మ్యములను పండ్రెండు ఘడియలు గురునిదినమునందు ఇరువది
యును - ఘటికలుదోషమై ఘటియించుతూర్పుకు దధినక్షిణాన
కుదసరునూనె - పడమరకును గుడ్డపాలించు నుత్తరమునకు క్షీర
ముదోషదనితహరము - ఎన్నిదోషములున్న నన్నముదిని తూర్పు
నకున స్థమపుదక్షిణమున కర్ధ - రాత్రి పడమరకును ప్రీతియాను
తర - మునకును దయమందుబోయి రేని - మేల్గుగల్గునంచు మే
దినిలో జెప్పె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ ॥ సీ॥ మృ
గశిరమూలాధ మూలహస్తధనిష్ఠ లశ్విని రేవతి పౌష్యమియును -
శ్రవణపౌనర్వసు జగతిలోనుత్తమంబగు రోహిణుత్తరాభాద్ర ను
త్త - రలుమద్యమని జెప్పవలెనువీటికి శూలజెల్లుతూర్పు ధనిష్ఠ
జేష్ఠలుమరి - యశ్వని శ్రవణంబులగు దక్షిణమునకు పౌష్యముగో
హిణుల్ పడమరకును - పల్గుణులును హస్తబరగును త్తరముకు -
నిట్టితారలందు నిట్టిదిశల - కేగదగదటంచు యోగీంద్రులగుగురు-
చంద్రులనియె వాసుకేంద్రఘనత ॥ గీ॥ నాల్గురెండునేడునవలు పై
నితొమ్మిది - యనెడిలగ్నములు ప్రయాణమునకు - లాభకరము
గాన లక్షించిజనులంత - నడువమేలటంచు నుడివెఫణిప ॥

## తారాబలము.

వ॥ తారాబలమును జూచెటివాడు తనజన్మనక్షత్రము మొద
లుకొని ప్రయాణదిననక్షత్రమువరకు లెక్కించితొమ్మిదింట భాగింప
గా ౧ జన్మతారంశరీరనాశము ౨ సంపత్తారవిభవము ౩ విపత్తార
కార్యభంగము ౪ క్షేమతారమేలు ౫ ప్రత్యక్తార కార్యహాని

౬. సాధనతారకార్యానుకూలము, ౭. నైధనతారమరణము, ౮. హితతారసౌఖ్యము, ౯. పరమమైత్రితార-సంపద.

## చంద్రబలము.

తనజన్మరాశి మొదలుకొని ౧, ౩, ౬, ౭, ౧౦, ౧౧ ఈస్థానముల చంద్రుడున్న మేలుగలిగించును, ౨, ౯, ౫ ఈస్థానముల శుక్లపక్షమందును, కృష్ణపక్షములో ౪, ౮ యీస్థానములయందున్న శుభకరము.

## వివాహము.

సీ॥ వైశాఖమాఘ శ్రావణఫాల్గుణము జేష్ఠమాసముల్ హితవౌ మవాశి కెక్కు - మధ్యమంకార్తీక మార్గశిర్షంబులు అధమంబు ఇతరముల్ తిథులలోను - షష్ఠిపాడ్యమి ద్వాదశాష్టమి తదియ ఏకాదశి శుక్లపక్షమున కహితమవని రెండైదేశు మనెపదియును నాల్గు తొమ్మిదిబహుళ పక్షమ్మునందు - మేలుజేయుచుండు నాలుగైదార్ రెండు - వారములుశుభంబు జేరునిట్లు - దెలిశి జెప్పవలయు ధీమంతులనిబల్కె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ॥ సీ॥ రేవతనూరాధ మృగశిరయును యుత్తరాత్రయంబును మఖహస్తస్వాతి। రోహిణిశేష్ఠమా నూహజేయగ కుంభ మకర వృశ్చికములుమానసితర। లగ్నంబులెల్లను లావుశుభంబిచ్చు నుదయకాలంబును మొదటిరెఘుమా॥ నయముమ్యతీపాత్తు వైదృతి యోగముల్వరిఘయందున పూర్వభాగమరయు। కూడదను చు జెప్పువాడుక గలదిఖ। బుధుడు పెండ్లిలగ్నమునను యున్న। నతిపమిగుల భాగ్యవతియగా నిజంబని। జప్పబడియెనయ్య సప్పరాజ॥

కం॥ గురుశుక్రులున్నమనశుభా। వరులకుదీర్ఘాయువగును భాస్కరపుత్రా। కలిగమనకువైధవ్యము। స్థిరముగ బలికె భుజగ శేఖ

ర ఘనతర ॥ గీ॥ చంద్రుడున్న యెడల సతికిమ్మ్రోత్రమ్ము భూమి । పు త్రుడుండెనేని ద్విత్వమునకు । మృత్యుస్థదియు దెలిసి మెలగుట శ్రే ష్ఠమౌ । ననిపచించెనయ్య ఫణికులేంద్ర ॥ కం॥ శనియున్నను దారిద్రము - మొనశియు సంతానశూన్యమును రాహువుయు - స్సను జేయుసత్య్పమిలలో - ననుమనియె భుజంగనాధ కనికరమొ దవక ॥ గీ॥ లగ్నమునకుజూడ లావరైచంద్రుండు - రెంటనైన దు నాలుగింటతొమ్మి - దింటనుండమంచి నంటెం మునిదెప్పె - జూడనగునుకరుణ సుబ్బరాయ ॥ గీ॥ లగ్నమందుగాని లగ్నము నకునెళ-వైనునాల్గు తొమ్మిదైనగాని-బుధుడుగురుడు కవియుగది యంగవలెనని - దెల్పెసద్గురుండు దివ్యచరిత ॥ కం॥ రవిరాహు కుజుడు శనికే - తువులారిట పదునొకింట తొరిపుమూట - న్ద పిలిశుభమిచ్చెదరని భువిలోవినబల్కెనయ్య భుజగశ్రేష్ఠా ॥ కం॥ ఆరెంటను భార్గవుడుం - గారిదుజెనిఋదవ ఇంటకడువశినుస్సర - క్రూరులనిపింతు రేడట - జేరంనగి దేగ్రహంబు క్షితినిఫణీంద్రా॥ గీ॥ లగ్నమునకు బుధుడు లావరై కేంద్రంబు - లందునుండనైను వందలైన - పాపములనుద్రోయు వాడంచుబలికెను - సుఖమొ సంగిబ్రోవు సుబ్బరాయ ॥ కం॥ సురగురుడసురగురుడు హిమ - కరసూనుడు సర్వదోషఖండనకు వసుం - ధరకేంద్ర కోణముల లో - బరిగినమేలనుచుబలికె పన్నగశ్రేష్ఠా ॥ సీ॥ ధరదంపతుల జన్మతారలందునవైన జన్మనక్షత్ర రాశ్యందునైన - జననలగ్న మునందునైన వారికిరవిగురు బలములు చూడకుదరకున్న - దగదు వివాహంబు దలపగా జ్యేష్ఠలందొకటి మేలగు రెండుసుఖముకొద్ది - నైనుమూడును నాలుగనుకూలపడవెందు జ్యేష్ఠలనంగాను జ్యే ష్ఠపుత్రి - జ్యేష్ఠయనెడితార జ్యేష్ఠమాసంబును - జ్యేష్ఠపుత్రుడ దియు జేష్ఠమాస - మున వివాహమనిసుజన సంఘమందురు - గ

